# బాల వ్యాకరణం

## సంధి పరిచ్ఛేదం

### ద్రుతం పై హల్లులు

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# ద్రుత సంధులు

1. ద్రుతం + పరుషాలు > సరళ, బిందు, సంశ్లేష, స్వత్వ
2. ద్రుతం + సరళాలు, స్థిరములు > లోపసంశ్లేషలు
3. ద్రుతం + వర్గ యుక్కులు, సరళాలు > పూర్ణ బిందువు
4. అవసానమందు > లోపం
5. ద్రుతం పై న కారం
6. ఖండ బిందు, లోపముల, సంశ్లేషల నిరాకరణ
7. ద్రుత లోపం
8. నుగాగమం

# సరళాదేశం

16. ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు.

పూచెను + కలువలు =పూచెను గలువలు

తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు

చేసెను + టక్కులు = చేసెను డక్కులు

నెగడెను + తమములు = నెగడెను దమములు

మొగిడెను + పద్మము = మొగిడెను బద్మము

# సరళాదేశం – బిందు సంశ్లేషలు

17. ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు.

సంశ్లేషం బనఁగా ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూచెను + గలువలు = పూచెం గలువలు, పూచెఁ గలువలు, పూచె న్గలువలు

తోఁచెను + జక్కలు = తోఁచెం జక్కలు, తోఁచెఁ జక్కలు, తోఁచె ఞ్జక్కలు

# సరళాదేశం – బిందు సంశ్లేషలు

చేసెను + డక్కులు = చేసెం డక్కులు,
చేసెఁ డక్కులు, చేసె న్డక్కులు

నెగడెను + దమములు = నెగడెం దమములు,
నెగడెఁ దమములు నెగడెన్దమములు

మొగిడెన్ + బద్నము = మొగిడెం బద్నము,
మొగిడెఁ బద్నము , మొగిడెన్బద్నము

పక్షంబున స్వత్వం బగు. స్వత్వం బనఁగా ద్రుతమునకుఁ
బ్రకృతిభావము.

# సరళాదేశ రూపాలు

| వీని రూపం > | సరళం/ద్రుత స్వత్వం | బిందు | బిందు | సంశ్లేషం |
|---|---|---|---|---|
| పూచెను + కలువలు | పూచెను గలువలు | పూచెం గలువలు | పూచెఁ గలువలు | పూచెన్గలువలు |
| తోచెను + చుక్కలు | తోచెను  జుక్కలు | తోచెం జుక్కలు | తోచెఁ జుక్కలు | తోచెన్జుక్కలు |
| చేసెను+టక్కులు | చేసెను డక్కులు | చేసెం డక్కులు | చేసెఁ డక్కులు | చేసెన్డక్కులు |
| నెగడెను+తమములు | నెగడెనుదమములు | నెగడెం దమములు | నెగడెఁ దమములు | నెగడెన్దమములు |
| మొగిడెను+పద్మము | మొగిడెను బద్మము | మొగిడెం బద్మము | మొగిడెఁ బద్మము | మొగిడెన్బద్మము |

# ద్రుతం – లోప సంశ్లేషలు

18. ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునప్పుడు లోప సంశ్లేషంబులు విభాష నగు.

వచ్చెను + గోవులు = వచ్చె గోవులు, వచ్చె న్గోవులు, వచ్చెను గోవులు.

మెఱసెను+ఖడ్గము=మెఱసె ఖడ్గము, మెఱసె న్ఖడ్గము, మెఱసెను ఖడ్గము.

# ద్రుతం - పూర్ణబిందువు

19. వర్గయుక్పరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి.

వచ్చెన్ + ధాత్రీపతి = వచ్చెం ధాత్రీపతి

పాడెను + గంధర్వుడు = పాడెం గంధర్వుఁడు

కన్ + దోయి = కందోయి.

# ద్రుతం + హల్లులు – విహంగవీక్షణం

1) ద్రుతం + పరుషాలు > సరళాలు, బిందు, సంశ్లేష, స్వత్వములు

ఉదా - పూచెను + కలువలు = పూచెను గలువలు, పూచెం గలువలు, పూచెఁ గలువలు, పూచె న్గలువలు

2) ద్రుతం + సరళ, స్థిరములు > లోప సంశ్లేషలు వికల్పం

ఉదా - వచ్చెను + గోవులు = వచ్చెను గోవులు, వచ్చె గోవులు, వచ్చెన్గోవులు

3) ద్రుతం + వర్గయుక్కులు, సరళాలు > పూర్ణ బిందువు (కదాచిత్)

ఉదా - కన్ + దోయి > కందోయి

